# మాయావిలాపం

— నల్లా ఉపేంద్రాఖ్యులు



అశరీర శాస్త్రవేత్త, అచల సిద్ధాంత ప్రతిపాదిత గ్రంథకర్త, అచల పరిపూర్ణ ప్రబోధ ప్రవక్త, శ్రీ ధరస్వామి శిష్య రత్నం

**శ్రీమత్ శివగామ దీక్షితులవారు**

# మాయావిలాపం

నల్లా ఉపేంద్రాఖ్యులు



అశరీర శాస్త్రవేత్త, అచల సిద్ధాంత ప్రతిపాదిత గ్రంథకర్త ,

అచల పరిపూర్ణ ప్రబోధ ప్రవక్త, శ్రీ ధరస్వామి శిష్య రత్నం

## శ్రీమత్ శివరామ దీక్షితులవారు

# మాయావిలాపం

పూర్ణగురు భూమానంద రాజయోగి

నల్ల ఉపేంద్రాఖ్యుల వారి ప్రణీతం



ప్రచురణ

నేహాల్ బుక్ హౌజ్, వరంగల్.

# మాయావిలాపం

ప్రతులు: 2000

ధర : 10/-

6, మే. 2001

సందర్భం : చిల్లకూరు పూర్ణాశ్రమ గురు పూజోత్సవాలు

అడ్రసు : నల్ల నాగరాజు B.Com. (Comp.)

ఫోన్ : 443328

ఇ.నెం. 16-10-706, శివనగర్, వరంగల్ - 2.

(2) నల్ల ఉపేందర్, M.O.L.

సీనియర్ తెలుగు పండిట్, గవర్నమెంట్ హైస్కూల్,

గోవిందరావు పేట, జిల్లా వరంగల్.

డి.టి.పి. : తెలుగునాడు, రాధికా టాకీసు దగ్గర, వరంగల్.

ముద్రణ : ధనలక్ష్మి ఆఫ్‌సెట్ ప్రింటర్స్,

రాధికా టాకీసు దగ్గర, వరంగల్.

## శ్రీమత్ శివరామ దీక్షితీయాచల గురు పీఠాధిపతి

ఏతత్ అచల సిద్ధాంత ప్రతిపాదిత, కందార్థ, కంద పద్యాల రచయిత



# శ్రీమత్ భాగవతుల కృష్ణప్రభువు



యువరత్న, స్నేహశీలి,సహృదయదాత

**శ్రీ దిడ్డి నరేందర్‌గారు**

S.I. Prohibition Dept.

పెరకవాడ, రైల్వేగేట్, వరంగల్.

1116/-లు ఇచ్చినందుకు కృతజ్ఞతలు



పద్మబ్రాహ్మణుడు, జ్యోతిష వాస్తు శాస్త్రజ్ఞుడు

**అ॥ప॥ శ్రీమత్ బ్రహ్మానంద కోడం శంకరాచార్యులు**

శివనగర్, వరంగల్. ఫోన్: 422060

516/-లు ఇచ్చినందుకు కృతజ్ఞతలు



శ్రీమత్ శివరామ దీక్షితీయాచల గురుపీఠాధిపతి

**శ్రీమత్ అచలానంద**

**మడిపెల్లి రాఘవాచార్యులు గారు**

లక్ష్మి టాకీసు ఎదురుగా, వరంగల్.

3116/-లు ఇచ్చినందుకు కృతజ్ఞతలు



సహృదయ మిత్రులు, పెద్దలు

**అ॥ప॥ శ్రీ యెలుగం చిన్న కొమురయ్య గారు**

కన్వీనర్, పట్టణ పద్మశాలి, చేనేత విభాగం

కొత్తవాడ, వరంగల్. ఫోన్: 558517,

428255, 427155

516/-లు ఇచ్చినందుకు కృతజ్ఞతలు

## శ్రీమత్ శివరామదీక్షితీయాచల గురుపీఠాధిపతులు

సద్గురు దంపతులు



## శ్రీ శ్రీ శ్రీ అచలానంద అప్పసాని వేంకటరత్నం గారు
## శ్రీమతి నిర్మలానంద అప్పసాని నారాయణాంబ గారు

**నారాయణ పురం, ఉంగుటూరు (మం), ప॥గో॥ జిల్లా.**

2116/- లు విరాళము ఇచ్చినందుకు కృతజ్ఞతలు.

## గ్రంథముద్రణ దాతలకు కృతజ్ఞతలు

250/- అ॥వ॥ శ్రీమతి, మల్లికాంబా సమేతులు శ్రీ రంగు సాంబయ్య శాస్త్రిపద్మబ్రాహ్మణుడు, జోతిష, వాస్తు శాస్త్ర నిపుణులు ఇ.నెం. 11-20-38, కాశిబుగ్గ, వరంగల్. ఫోన్ : 433621

216/- అ॥వ॥ శ్రీ బత్తుల కన్నయ్య గారు, ప్రముఖ వ్యాపారి, తూడిదేవమాంబగారి శిష్యులు శివనగర్, వరంగల్

116/- అ॥వ॥ శ్రీమతి, కౌసల్యాదేవి సమేతులు శ్రీమాటేటి పాపయ్య గారు కొత్తవాడ, వరంగల్. ఫోన్ : 560120

116/- అ॥వ॥ శ్రీ కనుకుంట్ల రాజయ్య గారు, పోతకపల్లి, జిల్లా కరీంనగర్.

116/- అ॥వ॥ శ్రీమతి లింగమాంబ సమేతులు శ్రీ కస్తూరి రామచంద్రయ్యగారు, ఇ.నెం. 11-25-399, కొత్తవాడ, వరంగల్.

116/- అ॥వ॥ శ్రీమతి కమలా సమేతులు శ్రీ గాడి పల్లి రాజేశంగారు, కొత్తవాడ, వరంగల్. ఫోన్ : 423117

216/- అ॥వ॥ శ్రీమతి రాజ్యలక్ష్మీ సమేతులు శ్రీ కొలిపాక మదనయ్య జ్యోతిష పండితుడు, వాస్తునిపుణులు,
పుష్పనిలయం, పద్మనగర్, కొత్తవాడ, వరంగల్.

216/- అ॥వ॥ గజ్జల రాజకుమార్ శాస్త్రి గారు పద్మబ్రాహ్మణుడు జ్యోతిష పండితుడు, వాస్తునిపుణులు, కొత్తవాడ, వరంగల్.

216/- అ॥వ॥ శ్రీ ఆడెపు వెంకటస్వామి గారు, దేవమాంబగారి శిష్యులు, రంగశాయిపేట, వరంగల్.

116/- అ॥వ॥ శ్రీ ఆడెపు లక్ష్మినారాయణ గారు, చే. స. సంఘం అధ్యక్షులు, ఇ.నెం. 11-25-1158, కొత్తవాడ, వరంగల్. ఫోన్ : 437320

216/- అ॥వ॥ శ్రీమతి సుగుణాంబ సమేతులు శ్రీ సామంతుల రాజకనకయ్య గారు, కొత్తవాడ, వరంగల్. ఫోన్ : 423108

116/- అ॥వ॥ శ్రీ నిర్గపేట రామచంద్రం, మాన్యువల్ అసిస్టెంట్, తూనికలు కొలతల శాఖ, శివనగర్, వరంగల్.

కృతజ్ఞతలు...



మీ నేహాల్ (బిట్టు)
ది. 6-5-2001

# మాయావిలాపం

## 1. స్వగురు ప్రార్థన

సీ॥ శ్రీ శుభాకార మై। శివశక్తి రూప మై
వా గ్దేవి భావ మై। వరలు మాత
బ్రహ్మ విష్ణు మహేశ। పరమార్థ తత్వ మై
సకలార్థ సార మౌ। సదమ లాంబ
అశరీర శాస్త్ర మై। ఆ ద్యంత రహిత మై
ద్వయ దోష రహిత మై। తనరు మాత
ఎరుక మరుపు ల్లేని। ఏ వికారము లేని
పరిపూర్ణ బ్రహ్మ మై। బరగు మాత

తే॥ దీక్షితుల బోధ ధరణిలో। దివ్యముగను
చాటె మా తల్లి దేవాంబ। స ద్గు ణాంబ
అట్టి తల్లికి వందనా। లాచరించి
పాడు చున్నాను సీసాలు। పరవశాన

## 2. కవి గురు పరంపర

సీ॥ శ్రీ ధర స్వాములు। చించి వేసెను గొంతు
శివరామ దీక్షితుల్। చితుక బాదె
కంబలూరీ వారు। ఖండించె నా శిరం
పరశురామా వాళ్ళు। పాతి పెట్టె
భాగవతుల కృష్ణ। బాధించె పలుమార్లు
ఫీల్ఖాన వారలు । భీతి గొల్పె
అవధూత స్వా మేమొ। అవమాన పరచెను
ప్పలా వారు। మంటు బెట్టె

తే॥ ఇంక యే మని చెప్పుదు। నిపుడు కూడ
యుగ యుగంబుల నా బతు। కుత్త దంచు
వసుధ నల్లా ఉపేంద్రుండు। వ్రాయు చుండె
దండ మిక జారు కుంటాను। ధరణిలోన

## 3. ఎరుకను

సీ॥ షోడశ కళలతో । సొంపు మీరిన దాన్ని
ఎరుకమ్మ నా పేరు । నెరుగ రమ్మ
పంచ భూతాలతో । పరవశించెడి దాన్ని
ఎరుకమ్మ నా పేరు । నెరుగ రమ్మ
సప్త చక్రాలపై । సరస మాడెడి దాన్ని
ఎరుకమ్మ నా పేరు । నెరుగ రమ్మ
పరమ పావని నంచు । పది మంది గొల్చేరు
ఎరుకమ్మ నా పేరు । నెరుగ రమ్మ

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన
ఉన్న దన్నాడ బయలులో । నుత్త దంటె
దండ మిడి జారు కుంటాను । ధరణిలోన
పూర్ణ బోధను మించిన । బోధ లేదు.

## 4. మత వైవిధ్యాన్ని

సీ॥ ఆది శంకరులచే । నద్వైత మయ్యాను
మధ్వుని ద్వైతంబు । మాట వింటి
రామాను జాచార్య । రచన వైష్ణవ మైతి
ఆంబి కేయుల చేత । నంబ నైతి
గాణాపత్యుల చేత । గణపతి నయ్యాను
సౌర్యులు రవి యని । చాటినారు
జైన మై, బౌద్ధ మై । జగతి నిస్లాము నై,
క్రైస్తవ మార్గాన । కరుణ నైతి

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 5. అశాంతిని

సీ॥ జాతి భేదాలతో । జగడాలు గావిస్తి
ఖండ ఖం డాంతర । గదులు గడితి
సంద్రాలపై స్వంత । సరిహద్దులను గీస్తి
అణ్వాస్త్ర వ్యాప్తి । కారాట పడితి
శాంతి యనే చోట । సమరము చేయిస్తి
సరసాన్ని వికృతంగ । సంస్కరిస్తి
వ్యక్తి వ్యక్తికి మధ్య । అంతరం కల్పిస్తి
అంతర కలహాల । నఖిల షిస్తి

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 6. వివేకాన్ని

సీ॥ సత్య మసత్యాల । సార మెర్గిన దాన్ని
మాయ విద్యల వెల్గు । మాన్యురాల
మూడు లోకాలలో । ముచ్చ టెర్గిన దాన్ని
ఏడు లోకాలను । ఏలు దాన్ని
ఆశ నిరాశల । నంతు తెల్సిన దాన్ని
అనుభవ తత్వాన । నలరు దాన్ని
సరసాన్ని విరసంగ । సాగించె దానిని
కళ్యాణ దాయినీ । కలికి నమ్మ

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 7. విశ్వనిర్మాతను

సీ॥ ఆ ద్యంత రహిత మై । అంతట నిం డున్న
పూర్ణాన తోచిన । పూజ్యురాల
సుఖ శాంతు లిస్తాను । సోయగం బిస్తాను
అపురూప జీవితా । న్నంద జేస్త
సార హీనం బైన । సంసార యాత్రలో
నవ రసా లొలికించు । నటిని నేను
శోక మోహంబుల । చోద్యాలు గల యట్టి
జగము సృష్టించేటి । జాన నమ్మ

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 8. వర ప్రదాయినిని

సీ॥ ప్రజలకు భోగాలు । పంచి యిచ్చెడి దాన్ని
తను యోగ మాత నై । తనరు దాన్ని
ధన ధాన్య రాసుల । ధార బోసెడి దాన్ని
తను ఆశ రహిత మై । తనరు దాన్ని
కోరిన వాళ్ళకు । కొంగు బంగారాన్ని
తను మన రహిత మై । తనరు దాన్ని
గుడిలోన జను లంత । కొలిచేటి దైవాన్ని
తన దేమి కా దని । తనరు దాన్ని

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 9. మూలాన్ని

సీ॥ పూర్వ జన్మము నేనె । పోయె జన్మము నేనె
మరల జన్మము నేనె । మాయ నేనె

అసలు తానే నేను । ఆ ద్యంతముల్ నేనె
కర్మ ధర్మాల్ నేనె । కథలు నేనె

పంచ భూతాల్ నేనె । పంచీకరణి నేనె
తారకం నేనె యీ । తాను నేనె

ఓంకార ము న్నేనె । హ్రీంకార ము న్నేనె
గర్వ మన్నది నేనె । ఘనత నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 10. వాఙ్మయ రూపాన్ని

సీ॥ సాధనలు న్నేనె । సంసారము న్నేనె
పట్టి విడుపుల్ నేనె । ప్రజ్ఞ నేనె

వేద మోదము నేనె । వాదు లాటలు నేనె
ఉపనిషత్తులు నేనె । ఊహ నేనె

కావ్య రసాల్ నేనె । కల్పి తాదులు నేనె
మాయ మర్మము నేనె । మాట నేనె

సాహిత్యము న్నేనె । శా స్త్రాదులు న్నేనె
ఆట పాటలు నేనె । అవని నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 11. ఛాందస వాదాన్ని

సీ॥ శూద్రుడు వేదాలు । చూడంగ రా దంచు
ఆంక్ష పెట్టిన యట్టి । అహము నేనె
అస్పృశ్య తనియెడి । అజ్ఞాన పాచార
మవని పాటించిన । అల్పు డేనె
మత కలహాలతో । మహి గొప్ప భారతం
విడి పోవ జేసిన । వెర్రి నేనె
చదువు లేకను కొంత । ఛాదస్తమున కొంత
ప్రగతి నిరోధక । పాపి నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న దైన

## 12. హంతకు రాలను

సీ॥ విష పాత్ర నై గొప్ప । విజ్ఞున్ని చంపాను
సోక్రటీసును మళ్ళి । చూపలేను
చంపితి శిల నయ్యి । సద్దయా మూర్తిని
ఏసయ్య నిక మీద । నివ్వ లేను
పిస్తోలు గుండ్లు నై । పేల్చి వేసితి తండ్రి
ఆ మహాత్మా గాంధి । అవని లేరు
నమ్మించి ఆ తల్లి । న ట్టింట చంపాను
దకు రా లిందిర । ధరణి లేదు

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న దైన

## 13. మూఢాచారాన్ని

సీ॥ సతి సహ గమనాన్ని । సాగించి కొన్నాళ్ళు
ఆనంద మొందు న । జ్ఞాని నేను

బాల్య వివాహాల । పద్ధతి కొన్నాళ్ళు
పాటించి నట్టి పా । పాన్ని నేనె

స్త్రీ విద్య వల దను । స్థితిలోన కొన్నాళ్లు
పెత్తనం చేసిన । పిచ్చి నేనె

విగ్ర హారాధన । విలువల నిలువెల్ల
బ్రతికిన దౌర్భాగ్య । భావ మేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 14. పార్టీల నినాదాన్ని

సీ॥ అవని స త్యాగ్రహ । మాచరించిన యట్టి
కాంగ్రేసు వారల । కలిమి నేనె

ఫాసిష్టు వ్యతిరేక । పద్ధతి కల యట్టి
కమ్యూనిష్టుల వాద । ఘనత నేనె

భారత ప్రాచీన । ప్రాభవ రక్షక
భా.జ.పా. సిద్ధాంత । ప్రజ్ఞ నేనె

నటు సార్వ భౌమునై । నాయక మన్యునై
వెలిగిన ఎన్.టి.ఆర్. । వెలుగు నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 15. తిరుపతి దేవున్ని

సీ॥ ఏడు కొండలు నేనె। ఎంక టేసుడు నేనె
గుండ్లు కొట్టుట నేనె। గుళ్ళు నేనె
వడ్డి కాసులు నేనె। వరద హస్తము నేనె
బ్రహ్మోత్సవాల్ నేనె। బ్రహ్మ నేనె
ఆపద మ్రొక్కుల్ నే। నా పదలును నేనె
గోవింద నామాల। గోల నేనె
వజ్ర కిరీటాల। వైభ వాదులు నేనె
హుండీలు నేనె యీ। ఉనికి నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము। డెన్న డైన

## 16. అయ్యప్ప సాముల భక్తిని

సీ॥ అయ్యప్ప సాముల। ఆర్భాటముల్ నేనె
నల్ల బట్టలు నేనె। నలుపు నేనె
శబరి మలై నేనె। సామి శాస్తా నేనె
ముద్ర ధారణ నేనె। ముక్తి నేనె
చలి స్నానములు నేనె। శరణు ఘోషలు నేనె
పడి పూజలున్ నేనె। భక్తి నేనె
జ్యోతి చూచుట నేనె। చూడ లాభము నేనె
కన్నె సాములు నేనె। కత్తి నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము। డెన్న డైన

## 17. నాటకాన్ని

సీ॥ నాటకమును నేనె । నడుమ దర్శకు డేనె
నటకులు నేనె యీ । నటన నేనె
తెరలు లేపుట నేనె । తెరలు దించుట నేనె
వాద్యాలు సరిగమల్ । వంత నేనె
రంగు పూయుట నేనె । లైట్లు వెల్గుట నేనె
టిక్కట్లు ఆర్భాట । తీర్థ మేనె
ప్రేక్షకులును నేనె । పెను వన్సుమోర్ నేనె
రాగ రసము నేనె । రక్తి నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 18. మదాన్ని

సీ॥ అగ్రకుల మదాన । అన్యుల హింసించి
సమత భంగము చేయు । చవట నేనె
ధన మదంబున నేను । దారిద్ర్యులను బట్టి
వెట్టి చాకిరిలోన । నెట్టుదాన్ని
విద్యా మదంబు వి । వేచన లేకుండ
పలుగాకి మాటల । బరగుదాన్ని
బల మదంబున నేను । బలహీను లందరిన్
బాధించు దుర్మార్గ । బడవ నేను

తే॥ ఎన్ని అయితేమి శివరాము డెన్నడైన

## 19. అన్నీ నేనె

సీ॥ గుడి గోపురాల్ నేనె । గుట్టు రట్టులు నేనె
మత విభేదము నేనె । మాయ నేనె

దాన ధర్మాల్ నేనె । దాక్షిణ్యముల్ నేనె
కోప తాపాల్ నేనె । కోర్కె నేనె

హెచ్చు తగ్గుల్ నేనె । ఏర్పాటులు న్నేనె
జాతి భేదము నేనె । జగము నేనె

శరణా గతుడ నేనె । చరణ ధూళిని నేనె
మోక్ష మార్గము నేనె । ముక్తి నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## ౨౦. చేత బడిని

సీ॥ గాలి సోకుట నేనె । ధూళి సోకుట నేనె
చేత బళ్లా నేనె । ఘాత నేనె

సతి పతులు న్నేనె । సంతానము న్నేనె
వాస్తు బాధలు నేనె । వాంఛ నేనె

దీర్ఘ వ్యాధులు నేనె । దిక్కు మొక్కులు నేనె
చిత్త భ్రాంతులు నేనె । చిత్త మేనె

నరుని దృష్టి నేనె । నష్ట పడుట నేనె
దేహ బాధలు నేనె । దేహి నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 21. షడూర్మ్యులు నేనె

సీ॥ నేనె ప్రాణంబును । ఎల్ల జీవుల కెల్ల
క్షుధ తృష్ణలును రెండు । కూడ నేనె

నేనె మానసమును । ఎల్ల జీవుల కెల్ల
శోక మోహంబులు । చూడ నేనె

నేనె దేహంబును । ఎల్ల జీవుల కెల్ల
జనన మరణముల । జాడ నేనె

ఇవి షడూర్మ్యులు వీట్ని । విడువంగ రా దంచు
భయ భ్రాంతి కల్గించు । భ్రాంతి నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 22. మూడు గుణములు నేనె

సీ॥ సాత్విక గుణమునై । సచ్చరిత్రము నయ్యి
ధరణిలో వెలసిన । దాన్ని నేనె

రాజస గుణమునై । రంకు బొంకులు నయ్యి
ధరణిలో వెలసిన । దాన్ని నేను

తామస గుణమునై । తల తిక్క వేషాల
ధరణిలో వెలసిన । దాన్ని నేను

మూడు గుణాల్ మించి । మూర్ఖత్వమును మించి
గురు తత్వ మెరిగిన । గురుతు నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## ౨౩. వ్యాధి త్రయాన్ని నేనె

సీ॥ వాతంబు నేనె యీ । వాత రోగంబుల
ఎనుబది విధముల । వెలసినాను

పైత్యంబు నేనె యీ । పైత్య రోగంబుల
ఎనుబది రెండుగా । వెలసినాను

శ్లేష్మంబు నేనె యీ । శ్లేష్మ రోగంబులు
ఇన్నూటిరుపై నాల్గు । వెలసినాను

మూడు తీరుల రోగ । ముల ముంచి లోకాల
చీకాకు పరచెడి । చిట్టి నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## ౨౪. వైద్యంలో దోషాన్ని

సీ॥ డాక్టర్లు యన నేనె । దవఖాన యన నేనె
పేషెంట్లు యన నేనె । పీడ నేనె

కల్తి మందులు నేనె । నఖ్లి మందులు నేనె
కంపౌండ రన నేనె । కంపు నేనె

వార్డు బాయులు నేనె । వాచ్ మెన్ లు న్నేనె
లంచాలు నేనె యీ । లత్త నేనె

ప్రైవేటు ప్రాక్టీసు । పరికించగా నేనె
శ్రద్ధ చూపక చచ్చు । చావు నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 25. చౌక డిపోల మోసాన్ని

సీ॥ చౌక డిపో నేనె । సరుకు లమ్ముట నేనె
బొట్లు కాంటా నేనె । బ్లాకు నేనె
పంక్తి కట్టుట నేనె । ప్రక్క కమ్ముట నేనె
అక్రమ వ్యాపార । మంత నేనె
ఎండి కొందరు నేనె । నిండి కొందరు నేనె
డీలర్ల మోసాల । దిడ్డి నేనె
సమ సమాజము నేనె । సర్కారులును నేనె
సంక్షేమ పథకాల । జాదు నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 26. క్రికెట్ మ్యాచ్ ఫిక్సను

సీ॥ క్రికెట్ ఆటయు దాని । క్రీడా కారులు నేనె
వికెట్స్, బ్యాట్స్, బాల్ । వెతలు నేనె
బౌలింగు, బ్యాటింగు । బాడరులును నేనె
రన్స్, ఫోర్, సిక్స్‌ల । రభస నేనె
ప్రేక్షకులును వాళ్ల । పెడ బొబ్బలును నేనె
వోవర్స్ లెక్కల । ఊసు నేనె
సాటి వాని రికార్డు । సరి ఐద్ద లన నేనె
మ్యాచ్ ఫిక్స్‌లలోని । మమత నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 27. ద్వయ దోష రూపాన్ని

సీ॥ శ్రీ రామ చంద్రు నై । చిర కీర్తి వడసితి
సతి వియోగపు బాధ । సైప నైతి

లంకాధి పతి నయ్యి । బింకాన మసలతి
పర సతి చెర బట్టి । పతన మైతి

ధర్మ రాజుగ బుట్టి । ధర బొంకు బొంకితి
దుర్యోధ నుండనై । దునుమ బడితి

అభిమాన వతినయ్యి । అమ్మితి భర్తను
భక్తితో రుక్మి ణై । పతిని గొంటి

తే॥ ఎన్ని అయితేమి శివరాము డెన్నడైన

## 28. పూర్వ వైభవాన్ని

సీ॥ సాత వాహన వంశ । చక్ర వర్తులు నేనె
కాకతీయుల నాటి । కళలు నేనె

విజయ నగర రాజ । విజయ హాసము నేనె
హైంద వేతర పాల । నాంశ నేనె

స్వేచ్ఛ స్వాతంత్ర్య సం । క్షేమ రూపాన్ని
ఆంగ్లేయ దౌర్జన్య । ఆంక్ష నేనె

ప్రజా ప్రభుత్వాలు । ప్రజల హక్కులు నేనె
అధికార దోపిడి । కాంక్ష నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 29. గూండా నాయకుణ్ణి

సీ॥ రాజకీయము చేస్తి । రాద్ధాంతములు జేస్తి
గ్రూపులు కడితిని । గూండ నైతి
దోపిడీల్ హత్యలు । దొంగ తనాల్ చేస్తి
ఎదురు తిర్గిన వాళ్ల । వెంట బడితి
సర్పంచు కాకుండ । శాసన సభ కెల్తి
మంత్రి నై దేశాన్ని । మన్ను జేస్తి
లంచ గొండూ స్కాము । రండాల రాజ్య మన్
దూషణ పాలైతి । దొరికి పోతి

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 30. అన్ని జిల్లాలు ఏలినాను

సీ॥ శ్రీ కాకుళం కృష్ణ । చిత్తూరు గుంటూరు
హైదరాబాదు అ । నంత పురము
కర్నూలు మొదలగు । కరినగర్ వోరుగల్
మెదకు రంగారెడ్డి । అదిలబాదు
ఉభయ గోదావర్లు । ఉత్కృష్ట[illegible]ము నల్గొండ
వీశాఖ పట్టణం । విజయ నగరు
ఖమ్మం నిజాంబాద । కడప ప్రకాశము
నెల్లూరు ఎం. నగర్ । ఏలి నాను

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 31. రాజకీయ గోలను

సీ॥ రాష్ట్ర పతుల గోల । రాజ్యాంగ మున్నెనె
ప్రై మినిష్టరు గోల । పదవి నేనె
పార్లమెంటులో గోల । పార్టీలు యన నేనె
గ్రూపులు గోల యా । కుట్ర నేనె
వోట్లకై గోల యీ । సీట్ల రూపము నేనె
కార్యకర్తల సీట్ల । కలహ మేనె
ఓటరు గోలనే । ఓట్లడ్గు టన నేనె
పనికి రానీ గోల । భ్రష్టు నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 32. చదువుల బరువును

సీ॥ ఏ.బి.సీ. చదువుల । కెగ బడినది నేనె
పోర గాండ్లకు పెద్ద । బోరు నేనె
అమ్మకానికి చద్వు । అమ్మ్ కొనుట నేనె
బడుగు ప్రజల చద్వు । బడులు నేనె
ప్రైవేటు హాస్టళ్ల । భ్రమలు గొల్పుట నేనె
ఆత్మ హత్యల చద్వు । లందు నేనె
ఎగ్జామి నేషను । ఎటు మాలుప్రాక్టీసు
ప్రశ్న పత్రములీకు । ప్రభుత నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 33. దుర్మార్గపు అత్తను

సీ॥ అత్తనై పుడితిని । ఆరండ్లు పెడితిని
కోడండ్ల బాధిస్తి । గొడవ జేస్తి
గయ్యాలి అత్తని । గుడుసు దీ అత్తని
దుమ్మెత్తి పొయ్యంగ । దులుపు కొంటి
వయసు శాశ్వత మని । వట్టి భ్రాంతిలొ జిక్కి-
పొగరు బోతను పేరు । పులుము కుంటి
ముసలి దాన్నైనప్డు । మురికెత్తి పోయంగ
కోడండ్ల రుసరుసల్ । కుమిలి పోతి
తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 34. మూర్ఖపు భర్తను

సీ॥ వరుడ నై పుట్టితి । వర గర్వమున నేను
వరకట్న మడిగితి । వాంఛ లూర
కోరిన కోరికల్ । కూర్చని భార్యను
గ్యాసు నూనెతొ కాల్చి । ఖతము చేస్తి
భార్య తరపు వారి । బాధింపు లే కావు
పోలీసు వారల । లీల లెన్నొ
నన్ను మాత్రమె కాదు । నా తలిదండ్రుల
నరకాన్ని చూపించి । నలిపినారు
తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

### 35. దేశ ద్రోహాన్ని

సీ॥ వ ద్దంటె పిల్లల । వదలక కంటిని
పెంచు మనిన చెట్లు । పెంచ నైతి
కాలుశ్యమును పెంచి । కష్టాలు తెస్తిని
సోమరి తన మందు । స్రుక్కి పోతి
చదువు చదువనైతి । సంస్కారి కా నైతి
అజ్ఞాన చీకట్లు । నలసి పోతి
దేశ ద్రోహము చేస్తి । ద్వేషాగ్ని రగిలిస్తి
శత్రు దేశాలతో । చెలిమి చేస్తి

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

### 36. టక్కరి దానను

సీ॥ కంబలములు గట్టి । గంతలు గజ్జెలు
బోడి తలల తోడి । బొంకి నాను
టక్కరి వేషాల । తందాన లాడితి
కడుపు కొరకె చాల । కతల బడితి
దొంగ మంత్రాలతో । దొరకు మోక్షం బంచు
శిష్యుల మోసాన । చెరచినాను
అక్ష మాలను బట్టి । పక్షోలె జపియించి
పది మంది మెప్పించ । పాట్లు బడితి

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 37. కర్మ భ్రాంతిని

సీ॥ ఆలి రంకూ తెల్యా । నఖిల యజ్ఞాల్ చేస్తి
తలి రంకు తెలిపితి । త ద్ది నాన
కర్మ కాండలు ఎన్నొ । కల్పిస్తి నా కయ్యి
ప్రజలు నా కాల్మొక్కి । పైస లిడిరి
చచ్చిన తలి దండ్రి । సా పాటు కని వండి
పిల్చి కాకుల కెల్ల । పెట్టినాను
పియ్యి తినెడి కాకి । పితరు డౌ టె ట్లని
వేమన్న వాదించ । వెర్రి నైతి

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 38. బుద్ధి లేని భూత వైద్యాన్ని

సీ॥ భూతాన్ని మించిన । భూత వేషంబున
భూత వైద్యము చేస్తి । బుద్ధి లేక
భూత మెక్కడ నుండు । భూతాన్నె సే నయ్యి
భీతి చెందిన వాళ్ల । పీక్కు తింటి
కావి పంచెలు కట్టి । కడు యోగి వలె తిర్గి
సంసారు లిండ్లల్లొ । సరస మాడ్తి
ఆట పాటల తోడ । నక్క డిక్కడ తిర్గి
భాగవతుల పేర । బరగినాను.

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 39. ప్రతిమల పూజారిని

సీ॥ రాతి బొొమ్మల కేమొ । రంగైన వస్త్రాలు
గుళ్లు గోపురములు । కూర్చినాను

కూడు గూడూ గుడ్డ । కోరడు దేవుండు
చేసితి నా స్వార్థ । చింత కొరకు

ప్రతిమల స్థాపించి । ప్రాణ ప్రతిష్ఠలు
చేసి లక్షలు వేలు । చిదిమినాను

ఎడ్డి ప్రజలు వాళ్లు । యెక్కు డైనను గాని
పలికెనా ప్రతిమల । భ్రమల బెడితి

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 40. పిచ్చి ప్రయత్నాన్ని

సీ॥ ఆసనములు బన్ని । అంగంబు బిగియించి
వొడలు విరచు కొన్న । యోగి నైతి

కుక్కుటు మననంబు । కొక్కెర ధ్యానంబు
చాల యేండ్లుగ నేను । సలిపినాను

ఆకు లెల్లను తింటి । మేక పోతుల వలె
కాయ సిద్ధిని బహు । కాంక్ష చేస్తి

అల్ల బోడి తలలు । తెల్లని గొంగళ్ళు
ఊరక దంపుడు మాట । లుత్త గోల

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 41. పంచాంగ బ్రాహ్మణ్ణి

సీ॥ బతుకు దెర్వు కొరకు । పంచాంగ ములు జెప్పి
పౌరోహితుడ నయ్యి । బతికినాను

బ్రహ్మ మెరుగని వాణ్ణి । భయముతో నా కాళ్లు
పట్టించు కొన్నాను । ప్రజల చేత

శత మాన ము భవతు । శాస్త్రాలు తెలియక
పెండ్లి ముహూర్తాలు । పెట్టినాను

కలిసి రాకనె వాడు । ఖత మయ్యె ముం డయ్యె
పరువు మంటు కలిసె । భ్రష్టు నైతి

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 42. అజ్ఞానాన్ని

సీ॥ చదువు చదివినాను । సన్యాసి నయ్యాను
షణ్మతంబుల చిక్కి । చచ్చినాను

పుస్తకాలు చదివి । మస్తక మెక్కక
పుస్తకాలకు పూజ । పొగస జేస్తి

బల్లి పాటుకు ఫలం । ప్రజలకు చెప్తితి
కాని పనికి వాళ్ల । కర్మ మంటి

గూబ గృహము జేరి । కూసితె తప్పంటి
పొరుగు సూర్ల క్రింద । పొర్లు మంటి

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 43. సమయ హారిణిని

సీ॥ కర్మలు పదివేలు । కర్మాన కొందర్ని
జ్ఞాన భాండాగార । కతన కొంత
ధర్మాన కొంద ర్న । ధర్మాన కొందర్ని
కొట్టుకు చచ్చేట్లు । కూర్చినాను
ఈ షణ త్రయమున । యిబ్బంది పెట్టాను
మూడు గుణాలలో । ముంచినాను
అతి నిద్ర అతి పాన । మతి కోప వశమున
కాలాన్ని వ్యర్థంగ । గడిపినాను

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 44. బూటకపు నియమాన్ని

సీ॥ నా కుప దేశాల । కర్థము రా దని
వేరె గురుల వద్ద । కెళ్ల వద్దు
వెళ్లితె పతివ్రత । వే రొక పురుషుణ్ణి
తగులు కొన్న ట్లని । తగవు పెడితి
పరమ రహస్యంబు । ప్రశ్నించె వాళ్ళను
బండ బూతులు తిట్టి । పంపినాను
అసలేమి రాకున్న । అర్థంబు తెలియక
బహు రూప వేషాల । బతికినాను

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన

## 45. ద్వంద్వ భ్రాంతిని

సీ॥ జనన మరణ భ్రాంతి। జాడ్యాలు నా రూపె
కట్టు బోతులు నేనె। కష్ట మేనె
గ్రహ బాధ, గృహ బాధ। కర్మ బాధలు నేనె
అనుమాన మభిమాన। మంత నేనె
శత్రు బాధలు నేనె। మిత్ర కూటమి నేనె
కలహాల స్నేహాల। కాంక్ష నేనె
ధన ధాన్యములు నేనె। దారిద్ర్యమును నేనె
కలిమి లేములు నేనె। ఘనత నేనె

తే॥ ఎన్ని అయితేమి శివరాము। డెన్న డైన

## 46. ఎయిడ్స్ వ్యాధిని

సీ॥ అంద చందాలతో। అల రారు యువతను
చచ్చు పీనుగ చేసి। చావ గొడితి
భార్యల విడనాడి। పర స్త్రీల దరి జేరు
బడ వల ప్రాణాల। బలిమి గొంటి
ఏయిడ్సు వ్యాధినై। ఎల్ల దేశాలలో
మృత్యు కోరలు చాచి। మురసినాను
జన్మ మృత్యులపైన। జరయు వ్యాధుల పైన
సాగించు చాలెంజి। సాగ నివ్వ

తే॥ ఎన్ని అయితేమి శివరాము। డెన్న డైన

## మాయా విరహ సీసాలు పది

### 47.

సీ॥ సఖియ నీ నెమ్మోము । చంద్ర బింబం బంచు
చేరి ముద్దాడిన । చెలిమి కాడు
కొమ్మ నీ పెన్నెరుల్ । కొదమ తుమ్మెద లంచు
దువ్వి కొప్పులు పెట్టు । దోస్తిగాడు
సుదతి నీ కెమ్మోవి । జుంటి తేనియ యంచు
మొన పంట నొక్కెడు । మోహనుండు
ఇంతి నీ పాలిండ్లు । దంతి కుంభము లంచు
గ్రుచ్చి కౌగిట చేర్చు । కోమలుండు
తే॥ కాంచె గురువును క్షణములో । కాంక్ష లన్ని
కాలిపోయెను ప్రియు డింక । కలిసి రాడు
వలపు బాసలు మరచిన । వాణ్ణి మళ్లి
కూడుకొన రోత కనుక నే । వీడి పోదు

### 48.

సీ॥ చిగురు టాకుల బోలు । చెలియ నీ పాదముల్
అరటి బోదెలు తొడ । లన్న వాడు
ఇసుక తిన్నెల బోలు । యింతి నీ పిరుదులు
గగన మధ్యం బన్న । గడుసు వాడు
పూర్ణ చంద్రుని బోలు । పొలతి నీ నెమ్మోము
కురులు మేఘము లన్న । కుర్ర వాడు
సంపెంగ పువ్వంటి । జాన నీ ముక్కంచు
గండు మీనులు కన్ను । గవ యటంచు
తే॥ నిండు భక్తితో వర్ణించి । నిన్న మొన్న
ఇపుడు మా యని రోసెను । ఏమి సేతు
వలపు బాసలు మరచిన । వాణ్ణి మళ్ళి
కూడుకొన రోత కనుక నే। వీడి పోదు

49

సీ॥ కమ్మ విల్తుడు చేత। కత్తి పట్టిన నాడు
పాలిండ్ల చాటున। పండ బెడితి
పచ్చ విల్తుడు తన। బాకు దూసిన నాడు
అదర పానం బిచ్చి। ఆదు కొంటి
పంచ బాణుడు తన। బాణముల్ విడువంగ
కదసి తొందర రతుల్। కాచుకొంటి
మన్మథు డో దెబ్బ। మాటు పెట్టిన నాడు
కౌగిటిలో వాన్ని। కప్పు కొంటి

తే॥ ఎంతొ చేసితి మే ళ్లన్ని। యింతలోనె
మరచి మానవు డిప్పుడు। గురుని చేరె
వలపు బాసలు మరచిన। వాణ్ణి మళ్ళి
కూడుకొన రోత కనుక నే। వీడి పోదు

50

సీ॥ పువ్వు లోపల తావి। పుట్టిన య ట్లుండు
నరుడు నా కౌగిట। నలరు నాడు
నీరు క్షీరములోన నిలచిన య ట్లుండు
నరుడు నాతో ముచ్చ। టాడు నాడు
చంద్రునిలో కళ। జన్మించి న ట్లుండు
నరుడు న న్నేలిన। నాటి క్షణము
కుందనంబును మణుల్। కూర్చిన య ట్లుండు
నరుడు నన్ పొందిన। నాటి వేళ

తే॥ ఎంతొ మంచి మా బంధంబు। లంత రించె
గురుడు దొరికెను నరుడు నా। కూర్మి మరచె
వలపు బాసలు మరచిన। వాణ్ణి మళ్ళి
కూడుకొన రోత కనుక నే। వీడి పోదు

## 51

సీ॥ అలిగి యుండిన నాడు । అర లేని పలు విధ
బన్న సరము లిచ్చి । బ్రతిమి లాడె
నవ్వ కుండిన నాడు । నా మీద మోహాన
ముత్యాల విలు వైన । ముక్కె రిచ్చె
మాట లాడ న్నాడు । మా మీద ప్రేమచే
ఘన మైన వజ్రాల । కమ్మ లిచ్చె
బెట్టు చేసి న్నాడు । తట్టుకో లేకనే
కర కంక ణాదుల । కాన్క లిచ్చె

తే॥ అట్టి అను బంధ మీ నాడు । అంతరించె
సకలమును రోసి సద్గురు । సరస నుండె
వలపు బాసలు మరచిన । వాణ్ణి మళ్లి
కూడుకొన రోత కనుక నే । వీడి పోదు

## 52

సీ॥ బ్రహ్మా వాదులకైన । భ్రాంతి వాటిల్లని
పలికెను నను జూచి । పవలు రేయి
పరమ యోగుల కైన । మరు లుప్పు తిల్లనీ
సరసంబు లాడె తా । సతము మిగుల
జడ దారులకు నైన । చలనంబు కలు గంచు
తీర్మాణముల్ సేయు । దిట్ట తాను
సన్యాసులకు నైన । చలియించు మోహంబు
అంచు నా చెలికాడు । అనెడి వాడు

తే॥ అట్టి వాడు నా స్నేహంబు । కొట్టి వేసి
గురుని చేరెను ధరణిలో । గురుడె గొప్పా?
వలపు బాసలు మరచిన । వాణ్ణి మళ్ళి
కూడుకొన రోత కనుక నే। వీడి పోదు

## 53

సీ॥ నిమిషంబు వొక చోట । నిలువ నేరని మది
నిలిచె నెట్టులో గదే । నిర్మలముగ
పల్ల వాదరులతో । పలుక నేర్చిన వాడు
పలుకు శూన్యం బయ్యె । మెలకు వేము
పాన్పు పై పవళించి । ప్రణయ మాడెడి వాడు
ఏకాంత వాసియ్యై । యెట్లు నిలిచె
తలచ డాయెను తొలి । వలపులు యీ నాడు
సత్య మసత్యాల । చర్చ చేయు
తే॥ తెలిసె సద్గురు బోధలో । తెల్లముగను
కాలె బో ధాగ్నిలో తన । కర్మ లన్ని
వలపు బాసలు మరచిన । వాణ్ణి మళ్ళీ
కూడుకొన రోత కనుక నే। వీడి పోదు

## 54.

సీ॥ విరి శయ్య పై నుండి । వీడి పోవగ జూస్తి
పట్టుకో నైతి నా । పడుచు వాణ్ణి
కోపించ కప్పుడే । కొసరు ముద్దుల తేల్చి
బతిమాల నైతి నా । పడచు వాణ్ణి
విడె మిచ్చు నప్పుడే । వినయము జత జేసి
మచ్చిక గొన నైతి । మానవుణ్ణి
పడక టింటిలో బాగ । పైట కొంగుకు గట్టి
బంధింప నైతి నా । బాలకుణ్ణి
తే॥ కాంత కాంచన లోలు డై । కాల మంత
గడిపె క్షణములో జ్ఞానియ్యై । కళ్ళు తెరచె
గురుని మార్గాన జగ మంత । ఎరుకె యంచు
ఎరుక కావలి పరిపూర్ణ । మెరిగె నరుడు.

55

సీ॥ మందుల మారి నై । మం దివ్వ నైతిని
మంచి వా డను కొంటి । మానవుణ్ణి
జిత్తుల మారి నై । చిత్తు సేయగ నైతి
మంచి వా డను కొంటి । మానవుణ్ణి
మంత్రాల తంత్రాల । మాయ జేయక పోతి
మంచి వా డను కొంటి । మానవుణ్ణి
నగ్నంగ ఉద్విగ్న । నాట్యాన్ని త్యజియించి
క్షణములో నను వీడె । కల నరుండు.
తే॥ నేనె తా నని తానును । నేనె యంచు
ప్రకృతి పురుషుల లీలలు । పొదు కొల్పి
మాయలో మాయ మై పోయె । మాట లేదు
నేనె శూన్యమై పోతిని । నిజమె గెలిచె

56

సీ॥ సద్గురు కథ లన్ని । చదువుకున్నా డేమొ
అంగజు ఖల మెల్ల । నణగి పోయె
సద్గురు మహిమల । జాడ కన్నా డేమొ
అలరు కోయిల కూత । లణగి పోయె
సద్గురు రూపంబు । సాక్షాత్కరించెనో
మాయ నా రూపంబు । మాయ మయ్యె
సద్గురు మంత్రంబు । చైతన్య మబ్బెనో
జ్ఞానంబు నా మీద । ఘనత గాంచె
తే॥ ఎంతో కాలంబు నా చెంత । యిచ్చ కంబు
లాడు నరునకు గురు దీప్తు । డధికుడాయె
వలపు బాసలు మరచిన । వాణ్ణి మళ్లి
కూడుకొన రోత కనుక నే । వీడు చుంటి

[illegible]

## శ్రీ నల్లా ఉపేందర్ గారి పరిచయం

**20-2-2000 జన్మదిన వ్యాసం పరిచయకర్త : ప్రభావతీదేవి B.A.**

**20-2-1948** జననం **1958** నుండి **1960** వరకు మిక్కిలి బాల ప్రాయమున చిరుతల రామాయణ భజన పంతులుగా దుగ్గొండి మండలంలో చాలా గ్రామాల్లో ప్రచారం **1961** నుండి **1962** వరకు వరంగల్లు నగరంలో చాలా రకాల గుమస్తాగిరీ ఉద్యోగాలు **1967** నుండి **1973** వరకు శ్రీ విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాలలో ఎంట్రెన్సు నుండి బి. ఓ. ఎల్. వరకు విద్యాధ్యయనం **1979** నుండి **1980** వరకు యం. ఓ. ఎల్ ఉత్తీర్ణుడు కావడం, **1973** నుండి **1976** వరకు ప్రైవేటు, రికగ్నైజుడు ఎయిడెడ్ పాఠశాలలో ఉపాధ్యాయ వృత్తి నిర్వహించడం. **1977** నుండి ఇప్పటి వరకు జెడ్. పి. హైస్కూల్లో తెలుగు పండిట్‌గా చేర్యాల, కడవెర్గు, మల్లికుదుర్ల, ఇనుగుర్తి, ధర్మసాగరం, దేవగిరిపట్నం, జూకల్లు, మంగపేట, గోవిందరావుపేటలో పనిచేయడం, **1966** నుండి **2000** వరకు సుమారు **40** గ్రంథాలు రచించడం చాలా వరకు ముద్రించడం జరిగింది. **1958** నుండి ఈనాటి వరకు సాంఘిక, పౌరాణిక, యక్షగాన, వీధి స్టేజి నాటకాలు ఆడడం, చూడడం నాటక సంస్థలు స్థాపించడం, ఆడించడం ఇదో తీరని కోరిక, అంతం లేని ఆరాటం **1962** నుండి ఇప్పటి వరకు అచల బోధలో గురువై శిష్యులకు పారలౌకిక జ్ఞానాన్నందిచడం, అం. ప్ర. లోనే కాక అనేక రాష్ట్రాల్లోని ఆశ్రమాధి పతులతో, గురువులతో సన్నిహిత సంబంధం కలిగియుండడం, సన్మానాలు సత్కారాలు అనేకాలు, సరస్వతీ పుత్రుడు, అక్షర సమరయోధుడు, నిత్య సాహిత్యారాధకుడు మొ॥ ప్రశంసా నామాలతో సాహిత్య సేవ. పూర్ణగురు, భూమానంద దీక్షా నామాలతో పరిపూర్ణ బోధ ప్రచారం, ఆబాల రంగస్థల నటరత్న బిరుదు, మంధర వేషంతో ప్రారంభమైన నటజీవితం రామాయణంలో, అన్ని పాత్రలు ధరించడం, శిష్యులకు నేర్పించడం, అంత చిన్న వయస్సులోనే ఆహా ఓహో అనిపించుకోవడం... ద్రౌపది, కాంతామతి, కాంచనమాల, చిత్రాంగి, చింతామణి, అల్లిరాణి, నక్షత్రకుడు, భీముడు, ద్రోణాచార్య మొదలగు అనేక విభిన్న పాత్రల్లో రాణించడం జరిగింది. ఎనిమిదేండ్ల వయస్సులోనే కామమ్మ మొ॥ కథలను రాత్రుళ్ళు దీపాల ముందు వాడ ప్రజలకు వినిపించడం, బాలనాగమ్మ, పెద్ద బొబ్బిలి, బతుకమ్మ పాటలు చెర్విరాల భాగయ్య యక్షగానాలు వినడానికి వృద్ధులు దరిజేరడం వారికి ఆ కథలు వినిపిస్తూ వారి నుండి అనేక పొడుపు కథలు, సూక్తులు నేర్చుకోడం, యాజుష పూర్వ ప్రయోగ చంద్రిక కొనుక్కొని పెండ్లిళ్ళు, గృహ ప్రవేశాలు, సత్యనారాయణ, కేదార వ్రత కథలు చెప్పడం, జ్యోతిష్యం పుస్తకాలు, వాస్తు గ్రంథాలు చదివి అవసరం ఉన్న వాళ్ళకు చెప్పడం, హస్త సాముద్రిక శాస్త్రాది అనేక రకాల వాఙ్మయాన్ని చదువుకోవడంలో మొదయిన పిపాస వందల శతకాలు, నాటకాలు, కావ్య, ప్రబంధాలు పి. హెచ్. డి. గ్రంథాలు చదువుకోవడానికి తోడ్పడ్డది. కీ॥శే॥ మాన్యులు యం.ఎస్. ఆచార్యగారి ఆశీస్సులతో పత్రికారచనలు చేయడ ం, మధుప, పూర్ణశ్రీ అను కలం పేర్లతో విభిన్న ప్రక్రియలకు చెందిన

రచనలు చేయడం జరిగింది. అనుష్ఠాన క్రమం నుండి అనంతోపనిషత్తు వరకు పద్య, గద్య, వచన కవిత, కథానిక, పాట, వ్యాసం, విమర్శ, సమీక్ష, జీవిత చరిత్ర వంటి రచనలు చేయడం, అనేక మతాలకు చెందిన మూల గ్రంథాలకు నూతన పద్ధతిలో సరళ సుందరమైన రచనలు చేయడం, వెనుకబడిన కులాల ప్రాచీన వైభవాన్ని సేకరించి పాటలు వ్రాసి క్యాసెట్లు నిర్మాణం చేయడం, ఇట్లా మా నాన్నగారు చేస్తున్న ప్రయత్నంలో మాకూ భాగస్వామ్యం కల్పిస్తు నడిపిస్తున్నారు. ఇన్ని కళల సమ్మేళనంతో పాటు ఉపాధ్యాయవృత్తి పట్ల అంకితభావంతో పని చేస్తున్నందు వల్ల జిల్లా కలెక్టర్ ద్వారా ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు లభించడం ముదావహం.

రచయితగా, రంగస్థల నటుడిగా, వేదాంత ప్రబోధకుడుగా, ఉపాధ్యాయుడుగా నాలుగు పాయలుగా విస్తరించిన యాభైరెండేండ్ల జీవితం సుఖదుఃఖాల సమ్మేళనం. యీ అంతటిని నడిపిస్తున్న శారదాంబ దివ్యకృపా విశేషానికి అంకిత మంటారు నాన్నగారు. తన జీవితంలో కృతజ్ఞతలు చెప్పవలసివస్తే అనేక మంది నా గ్రంథ ముద్రణ దాతలకు చెప్పాలి అంటారు. అన్నిటికి మించి ప్రభుత్వానికి ధన్యవాదాలు చెప్పాలంటారు. ఎందుకంటే ఇన్ని కళలు కలిగిననేను జీవితంలో ఏ కళా తరంగానికో కొట్టుకుపోయే అవకాశం ఉండేది. ఏ కళకు సరియైన గుర్తింపు-సహకారం సమాజంలో లేదు. కనీసం యీ ఉద్యోగం వల్లనైనా మిమ్ములనూ-నాకళలను పోషించుకుంటున్నాను. అందుకే ఉద్యోగమిచ్చిన ప్రభుత్వానికి కృతజ్ఞత లంటారు. నాన్నగారు యీ యాభైరెండేండ్లలో ఏ అనారోగ్యానికి కానీ, ఆందోళనకు కానీ, గురి కాని మా నాన్నగారికి ఆ కళామ తల్లి ముందు జీవితాన్ని ఆనందమయం చేయాలని ప్రార్థిస్తున్నాను.

## రచనలు 1966 నుండి 2001 వరకు

అనుష్ఠాన క్రమం, అచలబోధ సిద్ధాంత పరిచయ వ్యాసం, ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర పోరాట గీతాలు, మేడారం సమ్మక్క-సారమ్మ జాతర విశేషాలు, నిర్మలానంద తత్వదర్శిని సంపాదకత్వం, రామప్ప శిల్పి కన్నీటిగాథ, మేర్గు నారాయణ రెండు గ్రంథాల పరిష్కరణ, రామేణ ఆదినారాయణ చరిత్ర, అచల వేదాంతాచార్యులు, తూడి దేవమాంబ జీవిత చరిత్ర, భాగవతుల కృష్ణ కవితా వైభవం, ప్రగతి సూత్రాలు ప్రజా గీతాలు, జలప్రళయం, ప్రబంధ గణపతి, అచలబోధ ప్రాదుర్భావం వికాసం వ్యాసం, అచలబోధ ప్రచారం విభిన్న ధోరణులు, ఆచారాలు, కావ్య కాంతామణులు, అచలబోధ వాఙ్మయ చరిత్ర, దుందుభి, శ్రీ గట్టు మల్లన్న క్షేత్ర మాహాత్మ్యం, అచలబోధ గురువులు - అంతః కలహాలు, అచలయోగి వేమన, సారా కథలు, భద్రాద్రి రామ శతకం సంశోధితం, క్షమించు అచల బోధ, అక్షర సమరం, బి.సి. చైతన్య గీతాలు, అనంతోపనిషత్తు గేయానువాదం, బైబిల్ ప్రసిద్ధ పాత్రలు, సుభాషిణీ దేవి దివ్య చరిత్ర, స్వామి అయ్యప్ప కథా సంగ్రహం పద్యకృతి. మొదలగునవి ఎన్నో...

# గాయక, పాఠక మహాజనులకు



**శ్రీమతి నల్లా ప్రసన్నలక్ష్మీదేవి**
M.A. Eng.(Lit.)

తే॥ ఎన్ని అయితేమి శివరాము । డెన్న డైన
ఉన్న దన్నాద బయలులో । నుత్త దంటె
దండ మిడి జారు కుంటాను । ధరణిలోన
పూర్ణ బోధను మించిన । బోధ లేదు.

ఇది యీ శతకానికి మకుటం. దీన్ని 3వ పద్యం నుండి 46వ పద్యం వరకు ప్రతిసీసం చివర విధిగా చేర్చుకొని చదువుకోవాలి. అట్లయితేనే విషయానుభూతి కలుగుతుంది. సిద్ధాంతావగాహన పెరుగుతుంది. ఈ గ్రంథకర్త నాకు మామ మరియు గురువు గారున్నూ. శతకానికి మూలం శివరామ దీక్షితీయాచల గ్రంథం. ఈ గ్రంథ సారాన్నంతటిని భా॥ కృష్ణ ప్రభువు ఒక్క కందార్థ పాదములో సంక్షిప్తీకరిస్తే తిరిగి ఈ కందార్థ పాదార్థాన్ని యింత శతకంగా ఆవిష్కరించారు మామగారు. ఇది ఈ శతకములోని పరమార్థం. "పరిపూర్ణ మొకటి తప్ప ఇతర మైన ప్రపంచమెల్ల తగ తెలియుము నీవు ఎరుకేయని". ఇది ఇక్కడ చెప్పబడిన అంశం. అయితే ఈ ఎరుక అనే పదానికి పర్యాయ పదంగా బహుళజన సులభోపయోగార్థమై మాయ అని పేర్కొనడం జరిగింది. మాయావిలాసం శతకంలో మరొక విశేషం సీసములో మాయ తన ఘనతను పేర్కొంటూ, తేటగీతంలో దీక్షితులవారి నిర్ణయాన్ని జపిస్తూ, పారిపోతున్నట్లు కనిపిస్తుంది. కనుక మకుటాన్ని విడిచిపెట్టకుండా మహానందభరితంగా పరవశించి పాడుకొంటారని మనవి చేస్తున్నాను.